# దొరికితేనే దొంగ!



రచన:

కపులూరి



ప్రచురణ:

నవీన గ్రంథమాల,
విజయవాడ-2.





# దొరికితేనే దొంగ

( నాటిక )



రచన

'కవులూరి'



నవీన గ్రంథమాల
విజయవాడ-2

TPLAID1B.III

3 9-60

# ముందుమాట

ఈ నాటికను తొలిసారిగా పాలకొల్లు నాటికలపోటీల్లో ప్రశంసనీయంగా ప్రదర్శించి, ద్వితీయ బహుమతి నొందిన ఏలూరు కళాకేంద్రంవారికి నా తొలి కృతజ్ఞత.

ఈ నాటికను 'విశాలాంధ్ర' పత్రికలో ప్రకటించి, నన్ను ప్రోత్సహించిన సంపాదకులకు సర్వదా కృతజ్ఞుణి.

ఈ నాటికను ఆదరించి. శ్రమించి, ఆంధ్రదేశంలో పలుచోట్ల ప్రశంసనీయంగా ప్రదర్శించి, నాటికకు వెలుగు జిలుగులు చేకూర్చిన కళాకారులందరకూ నా నమోవాకములు. వారి ఆదరణా, అభిమానమే నా భావి నాటక రచనలకు మూల కారణం.

విజయనగరం, ప్రజానాట్యమండలి వారీ నాటికను విశాఖజిల్లా యువజనోత్సవాల్లో ప్రదర్శించి ప్రథమ బహుమతిని పొందారు. అదే విధంగా సామర్లకోట, బందరు తదితర పట్టణాల్లో యీ నాటికను ప్రదర్శించి బహుమతులు పొందిన సంస్థలకూ, వివిధ కళాకారులకూ అభివందనలు.

ఈ నాటికను గ్రంథరూపములో పాఠకుల కందిస్తూన్న ప్రచురణకర్తలకు నా నమస్కృతులు.

పాలకొల్లు నాటిక పోటీల్లో ప్రథమంగా ప్రద
ర్శించిన ఏలూరు కళాకేంద్రానికి చెందిన

-: నటవర్గం :-

చంద్రయ్య : శ్రీ బి. ఆంజనేయులు
(ఉత్తమ సహాయనటుడు-నర్సాపురం నాటక పరిషత్తులో ద్వితీయ సహాయ నటుడు)

పోలయ్య : " డి. రామ్

స్వాములవారు : " వి. బాబు

వెంకయ్య : " అసిరయ్య

పిచ్చివాడు : " బి. రామారావు

# దొరికితేనే దొంగ

(బైరాగుల మఠం. మఠానికెదురుగా రోడ్డు. మఠంలో కుడివైపు ఎడంవైపు సన్నటి అరుగులుంటాయి. హాలుమధ్యలో ఒకదిమ్మ. వెనుకభాగంలో ఒక ఎత్తైన దిమ్మ. ఆ దిమ్మకు అటూఇటూ చిన్నచిన్నదిమ్మలు.)

తెరలేచేసరికి పిచ్చివాడొకడు సగంకాల్చినసిగరెట్టును వెలిగించి గంజాయిదమ్ము పీల్చినట్లు పీలుస్తూంటాడు. ఒకటి రెండు దమ్ములులాగి, దగ్గుతూ మూట విప్పి చూస్తుంటాడు. పిచ్చివాని తల తాటిపీచులా ఉంటుంది గడ్డం పెరిగివుంటుంది. ఆ మూటవంక చూసుకుంటూ తనలో తాను నవ్వుకుంటాడు. క్షణం తర్వాత ముఖం పొడవనువుతుంది.)

(ఇంతలో బయటినుండి యీ మాటలు వినబడ్తాయి)

చంద్రయ్య: సార్! వన్ అనా సార్! వన్ అణా.

ఒకరు: ఫో! ఫో!

చంద్ర: అదేమిటి సార్! ఓన్లీ వన్ ఆనాసార్ ... అబ్బే!... కానీ ఏమిటిసార్?

ఒకరు: ఓరి సీదర్జా మండిపోను ... పో! పో!

చంద్ర: సార్! సార్!

(ఎవరో వస్తున్న చప్పుడు వినపడేసరికి గాభరాగా మూటను కట్టేస్తుంటాడు)

చంద్ర: (వింగ్‌లోనుండే అనుకుంటూ స్టేజీమీదకు వస్తాడు) దర్జాగా సూట్లు వేస్తారేతప్ప జేబులో సింగిల్ పైసాయే ఉండదు ... జనాన్ని చంపడానికితప్ప ఎందుకువచ్చిన సూట్లండీ!... ఇవాళచాల బాడ్ డే ... లేవగానే ఏ వెధవముఖం చూచానో గాని ...

పిచ్చి: నీకంటే వెధవయి వుంటాడు ... హి! హి!... తమ్ముడూ, ఇవాళ నాకూ చిన్నంఎత్తు బంగారం దొరకలేదు ... హి! హి!

చంద్ర: ఉండరా నీగోల ఏమిటి? ఛీ! ... ఎందుకువచ్చిన డబ్బండి డబ్బు! డబ్బుండగానే సరా? ... దానం చెయ్యాని వాళ్ళంతా యీ దేశంలో ఎందుకో?...

పిచ్చి: దండగ? ... శుద్ధదండగరాబాబు శుద్ధదండగ! ... వాళ్ళను తరిమెయ్యి! ... హి! హి! ... అందు కేగా నేను డబ్బుంచుకోలేదు! ... అంతా బంగారం! అంతా బంగారంచేశా ... హి! హి!... ఇల్లంతా బంగారం అయితే ...

చంద్ర: (చిరాగ్గా) అరేయ్! నోర్మూయ్! ... పిచ్చివాగుడూ నువ్వూను! ... అబ్బబ్బా! పాడులోకం! ... ఎవడి గోల వాడిదేతప్ప, పక్కవాడిగోల పట్టించుకోరే!... ఏమైపోతుందోగాని యీలోకం!....

పిచ్చి: తగలబడిపోతుంది! ... హి! హి! .... తగలబడి పోతుంది ... నేనొక్కణ్ణేఉంటా ... నేనూ నాబంగారం ఉంటాం ... ఏమంటావ్ నా బంగారం?

చంద్ర: (కోపంగా) నీ తలకాయంటుందిరా నీతలకాయి ... అరేయ్ బంగారం పిచ్చోడా ? ... నీదగ్గరేమన్నా ఒకపావలా వుందిరా ?

పిచ్చి: పావలా డబ్బులేనా ! హి ! హి! ... పావలాడబ్బులేం కర్మ!... వేలుండేవి, వేలు !... ఎందుకూ వెధవ డబ్బు!... బంగారం !... నా బంగారం.

చంద్ర: పోనీ ఆ బంగారమే యిస్తావట్రా ?

పిచ్చి: అమ్మో! మా నాయనే !... బంగారం తెస్తే తీసుకుంటా ... నే దాసుకుంటా.

చంద్ర: (కోపంగా) మా చిట్టి నాయనే !... అరే నీ జేబు చూడనియ్యి ... ఎంతుందో ?

పిచ్చి: అమ్మో, నేను చూడనివ్వను ... దూరంగాపో.

చంద్ర: నీదగ్గర చాలావుందిరా !... ఊ !... అరేయ్ మర్యాదగా అడుగుతున్నా ... ఒక పావలాయియ్యి. మళ్ళీయిచ్చేస్తా ...

పిచ్చి: నేనివ్వనుగా ! హి ! హి ! బంగారం తెస్తానన్నావుగా! ఏది ... బంగారం తెస్తే డబ్బిస్తా.

చంద్ర: ఏమిట్రా భేషజం (అని రెండు నెత్తిమీదకొట్టి లాక్కుంటూవుంటాడు-పిచ్చివాడు 'అమ్మో, బాబో' అని అరుస్తాడు. చంద్రయ్య వాడి నోరుమూసి దొరికిన పావలా తీసుకుని మూటను విసిరేస్తాడు.

పిచ్చి: అమ్మో! నా బంగారం! (కొంచెం దీనంగా) నాబంగారం (అని ఏరుకుంటాడు.)

చంద్ర: ఫో ! యిక్కడినుండి ! ఉన్నావా యింకో రెండిస్తాను ఖర్చుకు , ఫో !

పిచ్చి: (దీనంగా) బంగారం తెస్తావుకదూ ?

చంద్ర: తెస్తాలే ! ముందు పో యిక్కడనుండి. (పిచ్చివాడు వెళ్ళిపోతాడు) అంతేచేయాలి - సాగితే దబాయింపు సాగకపోతే సాష్టాంగం ... హా ! హా ! లేకపోతే ఈ లోకంలో నెగ్గలేం ! ... అరేయ్ చంద్రం ... (నవ్వుకుంటూ) ఎట్లా తయారయ్యావురా ? డబ్బు ! డబ్బు! హా ! హా!... ఈ డబ్బుకోసం ఎన్ని ఎత్తులు, ఎన్ని జిత్తులు ... హా ! హా ! ఈ పావలాకోసం ఎంత ఘర్షణ ... ఈ పావలాతో నాలుక తడి చేస్తేనేగాని ఈ చంద్రం మనసు మజాగావుండదు. (అని వెళ్ళి పోతూండగా)

స్వాములవారు: జై సీతారాం (అనుకుంటూ వస్తాడు)

చంద్ర: ఓ ! స్వాములవారా ! ... జై సీతారాం.

స్వాము: శుభమస్తు.

చంద్ర: వట్టి ఆశీర్వచనా లెందుకుస్వామీ ... పైసామే పర మాత్మ ... ఏది రానివ్వండి పైసా ...

స్వాము: వేషం కనిపించడంలా, జోగులం.

చంద్ర: వేషంలోనే వుంది గురూ మోసం.

స్వాము: ఒక్క వేషమే ఏమిటి, ఈ మాయాజగత్తే పచ్చి మోసం జీవా !

చంద్ర: అవునవును, ...గురూ! బీడీదమ్మైనా లేక ఈ జీవి వాపోతుంది. ఏది రానియ్యి పైసా.

స్వాము: చెప్పానుగా జీవా?

చంద్ర: ఈ మఠానికి కొత్తవారులా వున్నారు?

స్వాము: నిముషంగడిస్తే పాతే నాయనా. కొత్త పాతల భేదం ఉండకూడదు.

చంద్ర: అంతేలే (అని వెళ్ళిపోబోంతుటాడు)

స్వాము: జీవా, ఇది నిరపాయకరమైన ప్రదేశమేనా అని మనసు ప్రశ్నిస్తోంది.

చంద్ర: ఇది మాయాజగత్తు! మోహంలో పడుతున్నారు గురువులు!

స్వాము: మోహంకాదు నాయనా, మోహంకాదు. జాగ్రత్తన్నది అందరకూ అవసరమేకదా ... ఇంతకూ నిరపాయ కరమైనదేనా?

చంద్ర: ఇక్కడంతా బైరాగులే గురూ ... అపాయమన్నది అడుగు పెట్టడానికి వీల్లేదు.

స్వాము: ఈ మఠం కట్టించిన పుణ్యాత్ము లెవరో?

చంద్ర: ఈ మఠంకట్టించిన పుణ్యాత్ముడిప్పుడు పుణ్యలోకంలో ఉన్నాడు. మనవంటి సోమరిపోతుల సంగతి తెలిసే ఆయన యీ పుణ్యకార్యం చేసిపోయాడు ... గురూజీ, లేటయిపోతుంది - ఏది రానివ్వండి.

స్వాము: జోగులమని చెప్పానుకదా నాయనా!

చంద్ర: వేషం డాబేనా, తూ. (అని వెళ్ళిపోతాడు)

స్వాము: అమ్మయ్య! పీడవదలింది ... ప్రశాంతంగా వుంది. కాసేపు రామా కృష్ణా అనుకోవచ్చు. (అంతా కలయ జూచి తన సంచీ, కమండలం, తులసిమాల ప్రక్కన పెట్టుకుని తాపీగా కూర్చుంటాడు. దూరంగా పోలీసు ఈల విన్పిస్తూంటుంది. ఒకడు ఆదుర్దాగా మఠం లోనికి పరుగెత్తుకువచ్చి ఒకమూల దాక్కుంటాడు. ఏమీ ఎరుగనట్లు స్వాములవారు కండ్లు మూసుకునే ఉంటాడు. ఆ వ్యక్తి స్వాములవారు కండ్లు మూసుకుని ఉండుటజూచి చప్పుడుకాకుండా జారుకో బోతూండగా)

స్వాము: ఆగరా పాపీ ఆగు ... పోలీసువాళ్ళ కళ్ళుగప్పినా ఈ స్వాములవారి కండ్లుగప్పలేవు ... ఇటురమ్మురా.

వెంకయ్య: అయ్యగోరూ ... ఉ.

స్వాము: భయపడకురా! యిటురారా!

వెంక: నే నే తప్పు సేయలేదుండి బాబయ్యా.

స్వాము: హాని తలపెట్టుట మా మతంకాదురా — భీతిని భయపెట్టి యిటుగమ్మురా.

వెంక: దండాలుసామి దండాలు. నే నే తప్పు సేయలేదుండి.

స్వాము: మాకు దొరలూ, దొంగలూ సమానులేరా ... జగమంతా మోసమేరా మొద్దూ ... భయపడక నిజంచెప్పు.

వెంక: సాములోరి మాటలు తెలవడంలేదు ... నేను దొంగ తనం సేయలేదుండి.

స్వాము: అనవసరంగా అబద్ధాలాడి అనర్థాలెందుకురా తెచ్చుకుంటావ్ ? అవసరానికి అబద్ధమాడి ఉపాయంతో అపాయంనుండి తప్పించుకోవాలిరా ... నువ్వు ఎందుకు పరుగెత్తుకు వచ్చావ్ ?

వెంక: రోడ్డుమీద ఎవరిదో పర్సుపోయిందంట - పోలీసోళ్లు నాఎంట పడ్డారు సామీ ... నేను నిజంగా దొంగతనం సేయలేదుండి.

స్వాము: మేము సర్వజ్ఞులం ... మావద్ద అబద్ధాలాడి అపాయం నుండి తప్పించుకోలేవురా జీవా ... నువ్వు రాజమండ్రి సెంట్రల్ జైలులో ఉన్నావా, లేదా ?

వెంక: ఎనక సేసినా కా నుండి యిప్పుడు సేయలేదుండి.

స్వాము: మాకు తెలుసురా! జైల్లో ఉన్నావా లేదా చెప్పు ... నువ్వు దాచినా సత్యం మాకు తెలియక పోదురా.

వెంక: ఎనక జైల్లో వున్నమాట నిజమేసామీ ... ఆ సంగతి మీకెట్టా తెలుసు సామీ ...

స్వాము: తెలుసురా, తెలుసు. త్రికాలజ్ఞులం.

వెంక: ఇప్పుడా దొంగపని మానేసానుండి.

స్వాము: అయితే నువ్వు కష్టించి పనిచేస్తున్నావురా పాపీ ?

వెంక: లేదు బాబూ లేదు.

స్వాము: ఊఁ ... అయితే మరి ఎలా బ్రతుకుతున్నావ్ ?

వెంక: అడుక్కుని బతుకు ఎల్లమార్చుకుంటున్నా సామీ.

స్వాము: ధన్యుడవురా ధన్యుడవు! ... దీనికిమించిన జీవితం లేదురా జీవా! ... అయితే అడుక్కుంటే పొట్టగడుస్తోందిరా ?

వెంక: ఏం గడవడంసామీ! ... అడుక్కుంటూంటే పోతు లాగున్నావ్ పనిచేసుకోకూడదూ అని అందరూ తిట్టేవాళ్లే ... పోనీ పని ఎవరన్నా యిత్తారా అంటే అదీ యియ్యటంలేదు. దొంగనని తెలిసినోల్లు కసి రేసారుసామీ! ... అందుకని అడుక్కుంటే వచ్చి నన్ని డబ్బులే వత్తాయి. రాత్రిపూట మాదాకబళం తల్లీ, అని అడుక్కుంటా ... ఏదో అట్టా ఎల్లమారి పోతాందిసామీ ...

స్వాము: నీకు భార్యా, బిడ్డలూ వున్నారురా?

వెంక: ఉన్నారుసామీ ఉన్నారు! అయితే ఏం లాభం సామీ? ...నా దొంగబుద్ధితోనూ, తాగుడుతోనూ యిసిగిపోయి, నా ఆడది నన్ను తగిలేసింది. ఇప్పుడు వంటరిగాన్నయి పోయినాసామీ (అని దుఃఖిస్తాడు)

స్వాము: దుఃఖించకురా, దుఃఖించకు! ...ఇప్పుడు స్వేచ్ఛా జీవివిరా!... ఏ బంధనాలూ బంధించవు. చూడు నాయనా, ఈ మఠంలో వాళ్ళసంగతి తెలుసునా?

వెంక: తెలుసుండి ... అంతా అడుక్కుతినే బాపతుండి... అప్పుడప్పుడు కొంతమంది పెద్దోల్లు గంజాయి పీల్చ టానికి వత్తుంటారంతే ... బాబయ్యా ఒక బీడీ ముక్క దయసేయండి.

స్వాము: అల్లాంటి అలవాట్లు లేవురా అబ్బీ! ... అబ్బీ!... ఈ మాయాప్రపంచం మర్మం తెలుసుకుంటే మజాగా బ్రతకవచ్చుగదా ... మరి కొత్తమార్గం వెతక్క పోయావ్?

వెంక: ఏం ఎతకనుసామీ ?... సదువులేని మొద్దుని ... సామీ... నాకోటి అడగాల్నుంది.

స్వాము: అడగరా అడుగు.

వెంక: మీమాట నాకు యినికిడిగా ఉన్నట్టుంది ... తమ రెప్పుడైనా రాజమండ్రం ...

స్వాము: (కోపంగా) ఏమన్నావురా పాపీ ? ...

వెంక: తప్పయిపోయింది సాములూ, తప్పయిపోయింది ...

(పోలయ్య ప్రవేశం - వెంకయ్యమాటలు వింటాడు- రాడీకట్టు)

పోల: ఎమిట్రోయ్,ఎంకా, సాములోర్దొద్ద ఉపదేశం పొందుతున్నావేంటి ?

వెంక: లేదు పోలయ్యా ! ... తేలీక ఒకమాట తూలినాను. ... అందుకని.

స్వాము- సంతోషంరా జీవా సంతోషం ... ఇప్పుడైనా తెలుసుకోరా జీవా ... కాలుజారితే తీసుకోవచ్చును గాని నోరు జారితే తీసుకోలేం ...

వెంక: సిత్తం ! సిత్తం.

పోల: అబ్బా ! ఏం తత్వం, ఏం తత్వం ! మన కొత్త సాము లోరికి బమ్మంగారు కూడా సరిపడట్టులేదు ... సానా బాగుంది.

స్వాము: జై సచ్చిదానంద !

పోల: సాఁబూ, మీారిక్కడకు కొత్తగా వచ్చినట్టుండారు ... మీా పేరోంటో అడగొచ్చునా అంట నా సామిరంగా

స్వాము: అడగడం తప్పేముంది నాయనా? ... నా పేరు చిదానంద సర్వజ్ఞ త్రికాలజ్ఞ స్వాములవారు.

పోల: (ఆశ్చర్యంగా) అబ్బో! అబ్బో!... పేరు మా బారుగా వుందే! నా బోటోడికి నోరెట్టా తిరుగద్దా అంట? ... సామీ ముందే సెబుతుండా ... మోటుముండా కొడుకుని ... ఏదన్నా మోట మాటొత్తే సెమిం చాలి నా సామిరంగా.

స్వాము: దాని కేముంది జీవా! మానవులం సర్దుబాటు కావాలి.

పోల: నా సామిరంగా బాగా సెప్పావు. బాగా సెప్పావు ... మీ పేరు బాబూ అమ్మా పెట్టినపేరేనా? ఆల్లకీ పేరు నోరెట్టా తిరిగిందీ అంట? ...

వెంక: ఓ పెద్ద పోకిరీ పోలయ్యా? ఆ యివర మంతా నీ కెందుకూ అంట?

పోల: తగ్గరా తగ్గు! సామికి లేని బాధ నీ కెందుకూ అంట? ... ఏమంటావు సాములోరు?

స్వాము: ఇందులో చిదంబర రహస్యం ఏమీ లేదు నాయనా! ఇది మా గురువుగారు నామకరణం చేసిన నామధేయం

పోల: సానా బాగుంది! సానా బాగుంది! ఇంతకూ సామీ, మనదే వూరూ అంట?

స్వాము: సంచారులం! ... ఒక ఊర నేమిటి నాయనా?

పోల: అట్టాగా సామీ! ... ... పోతే మనకు పిల్లా జెల్లా ఉండారా అంట?

స్వాము: యోగులకు ఈ మాయా సంసార బంధనా లుండవు జీవా!... ఏక్ నిరంజన్. ఆమాత్రం తెలీదా అబ్బీ!

పోల: అబ్బా సామీ! ఎంత మాటనేసారు నా సామిరంగా ... ఆ మాత్రం గానం ఏడిత్తే ఇంకేమంటా, ఒరే ఎంకా, నే నేంటో అనుకున్నా కాని. మన సాములోరు అణాకానీ రకం కాదురోయ్ ... ... గొప్పోరు, గొప్పోరు.

వెంక: ఏమనుకుంటుండావురా మరి!

స్వాము: (పోలయ్య నుద్దేశించి) నాయనా, ఈ వివరముల ప్రసక్తి ఎందుకో తెలుసుకోవచ్చునా?

పోల: ఎంత మాటడిగారు సామీ! ఏం లేదండి, ఈ మఠంలో మీరు కొత్తగా కనబడితే అడిగా ... అట్టా అడగొద్దంటారా అంట?

స్వాము: అడగవద్దని ఉద్దేశ్యంకాదు నాయనా! ఈ వివరము లెందుకా అని మనసు ప్రశ్నిస్తోంది. అంతే.

పోల: ఏంలేదు సామీ! గొప్ప గురు వన్నోడు దొరికితే ఈ సన్నాసి బతుకుమానేసి ఆయనొద్దనే ఉండిపోదామని అడిగాను గురువా!

స్వాము: అయితే మంచిది!

వెంక: ఈ ఏదాంతం పోకిరీవోడికి నీ కెందుకులే పోలయ్యా!

పోల: వద్దంటావా అంట?

వెంక: నీ కెందుకులే అంట?

పోల: సామి ఏమంటారూ అంట?

స్వాము: యోగులజీవితం చాల కష్టసాధ్య మయింది జీవుల్లారా! ... అది సామాన్యులందరకూ సరిపడదు.

వెంక: పోలయ్యో! ... సామిసెప్పినట్టు ఆ బతుకు మనకెట్టా వత్తది! ... నువ్వేమో డబాయిచ్చిబతుకు. నేనేమో అడుక్కుతిని బతుకుతా ... ఏదయ్యా ఒక బీడీ ఇయ్యి కుతిగా వుంది.

పోల: మా ఎంకడు సెప్పిందే నుంచిదంటారా సామీ?

స్వాము: మంచిది! చాలా మంచిది నాయనా.

వెంక: పోలయ్యో ఒక బీడీ యిత్తే నీ సొమ్మంతా పోదు లేవయ్యా!

స్వాము: దానానికి త్యాగబుద్ధి కావాలి నాయనా.

పోల: ఏంటి సామో, ఏదైనా తాగమంటూ సేత్తే నాబోటోడే సెయ్యాలి, నాసామిరంగా ... ఇదిగోరా (బీడీయిచ్చి వెలిగించి) బలేబీడీలే.

వెంక: (వెలిగించుకుని ఒక దమ్ములాగి)పోలయ్యతమ్ముడో! ... మాబాగావుందయ్యా యీ గంజాయి బీడీ! ... మా మంచోడివిలే.

పోల: సామీ! మీరుకూడా ఒక్కదమ్ము ఏశారంటే, సూడు నా సామిరంగా, అబ్బా! దేవుడు కనపడ్డాడన్నమాటే.

స్వాము: నీ ప్రేమకు మెచ్చితి జీవా ... కాని అట్లాంటివి ఈ స్వామికి నిషిద్ధం నాయనా.

పోల: మొకమాట పడకండి ... (ఒక దమ్ములాగి) ఏం బాగుం దనుకున్నావుసామీ! ... ఏదీ ఒక్కదమ్ము ....

వెంక: పోలయ్యో, సాములకు గొట్టంతో పీల్సే అలవాటుందేమో.

పోల: ఏం సామీ ?

స్వాము: అటువంటి అలవాట్లు ఈ మాయా ప్రపంచంపై మక్కువ వున్నవారికి

పోల: అబ్బా! అబ్బా! ఏం గొప్ప వేదాంతం! ఏం గొప్ప వేదాంతం! ... మరినాకు గంజాయి నేర్పినసామి అట్టాఅన్నాడే అంట ?

స్వాము: ఏం చెప్పాడు ?

పోల: ఈ గంజాయి పీలిస్తే ఈ పెపంచాన్ని మరిసిపోయి ఆ దేవుణ్ణి కొలవచ్చానాడే ... నాకోసమైనా ఒక దమ్మియ్యండి -

వెంక: పోనియ్యి పోలయ్యా, పెద్దోల్ని బలంతం సేయకూడదు ... బతిమాలిచ్చుకుని యిత్తే యిచ్చావు గాని, మాబలే బీడీ యిచ్చావులే ... పోలయ్యో, ఈ బీడీకోసం జైల్లో ఎంత సచ్చేవాళ్ళమనుకున్నావ్! జైల్లోపెట్టే రేసన్‌పురుగులుకూడును కూడా అమ్మేసుకునేవాళ్ళం.

పోల: అట్టాగంటరా ! అయితే బీడీ గొప్పదే అన్నమాట !

వెంక: ఆ ! ఏంటనుకున్నావ్ మరి !

పోల: సామీ ! ఎంకడు సెప్పింది నిజమేనా అంట ?

స్వాము: ఆ జీవి స్వానుభవంతో చెబుతున్న మాటను కాదనడానికి మన మెవరం నాయనా ?

పోల: ఆ మాట నిజమేలే సామీ...

వెంక: పోలయ్యా తమ్ముడూ, యియ్యాల యిట్టా వచ్చావేంటి?

పోల: ఏం తోసక సూసిపోదామని యిట్టా వచ్చా! ...
వచ్చినందుకు యీయాల మా మంచిరోజల్లే ఉందిలే

స్వాము: ఎందువల్ల ?

పోల: ఏం లేదుసామీ ! ... మీ గొప్పోరు దర్శనం
అయిందిగదా అంట. సామీ, నాకేదో మంచిదారి
సూపెట్టండి, ఈ ఎదవపని మానేసుకుంటాను.

వెంక: ఏంటి పోలయ్యోయ్, నీ బుద్ధి అట్టా మారతాందేం ?

స్వామి: మంచి ప్రశ్న !

పోల: మన బతుకు ఎదవబతుకు కాదంట్రా మరి ! పోనీ, నలు
గురితోనూ ఛీ అనిపిచ్చుకుంటన్నా, బతుకు సుకంగా
ఎల్లమారిపోతాందా అంటే అదీ లేదాయె ... అందు
కని బుద్ధిగా బతికితే పోలేదా అంట ?

వెంక: పోరా, బుద్ధిమారినా, బతుకు మారద్దాంట ?

పోల: ఏం సామీ, నువ్వుసెప్పు ! ఎంకడు సెప్పింది నిజమా,
నేను సెప్పింది నిజమా ?

స్వాము: నీ ఉద్దేశ్యం మంచిది పోలయ్యా మంచిది.

పోల: అరేయ్ ఎంకా, ఇట్టాంటి గొప్ప సాములోరు ఈ
మటంలో నీకెప్పుడైనా తగిలాడా ?

వెంక: లేదు తమ్ముడూ, లేదు ... ఇక్కడకు వచ్చేవాళ్ళంతా
సన్నాసులు కాదంట్రా !

పోల: మన సాములోరు గొప్పోరురా, గొప్పోరు ! రారా
సన్నాసి. మన సాములోరికి దణ్ణం పెడదాం (యిద్దరూ
దణ్ణం పెడ్తాంటే స్వాములవారు ఆశీర్వదిస్తాడు) ఈ

దెబ్బతో మనపాపాలన్నీ గంగలో కలిసినట్టే. తెలియని మొద్దులం సామీ. తెలియక అడిగితే తిట్టకండేం !

స్వాము: ఆగ్రహించడం మావంతు కాదు నాయనా ! అనుగ్రహించడమే మావంతు.

పోల: ఎంత మంచోరు నా సామిరంగా, ఎంత మంచోరు ! ...సామీ, మా యీదిలో ఒక దాసు హరికద సెప్పాడు. అందులో స్మశానవైరాగ్గమని ఏదో సెప్పాడు. మీవైరాగ్గమూ అదే నా అంట ?

స్వాము: హరి ! హరీ (అని చెవులు మూసుకుంటాడు)

పోల: (తెల్లబోయినట్లుగా)...ఏంటి సాములోరూ ?

వెంక: పోలయ్య తమ్ముడూ !... ఎందుకు మనకా గోల... బీడీ ఇచ్చావా ... ఒక్కసారి నాలికకూడా తడి సేయించావంటే ... నీ పేరు సెప్పుకుంటా.

పోల: సీ ! ఎదవంట ఎదవ ! పెద్దా సిన్నా లేదు ! ఎప్పుడూ ఎదవాలోశనేనా? సామీ, ఇందాక అట్టాగన్నారేంటీ అంట ?

స్వాము: పెద్దలను పరిహసించడం పాడికాదు నాయనా.

పోల: ఆస్యాని కడగలేదు ... అది తప్పా సామీ ?

వెంక: సాములోరితో ఆస్యం తప్పుకాదా మరి ?

పోల: అస్యంకాదురా దొంగఎంకా, ఆస్యంకాదు.

వెంక: (కోపంగా) అదిగో పోలయ్యోయ్, యిదే సెపుతుండా ఇకనించి నన్ను దొంగఎంకా అని పిలవమోకు.

పోల: అబ్బా !... ఓరి నీకెంత తుస్సు పొడుసుకొచ్చిందిరా?

స్వాము: అతడూ మానవుడే కదా నాయనా. మానవుడన్న వాడికి మానస మెక్కడికి పోతుంది.

వెంక: అదికాదు సామీ ... నేను దొంగతనం ఏనాడో మానేశాను. అయినా అదే పేరుతో పిలిస్తే బాధ గాదంటండీ!

స్వాము: అది మాయని మచ్చరా అబ్బీ, మాయనిమచ్చ. ఈ లోకంలో అనేక అన్యాయ వృత్తులు న్యాయంగా చెలామణి అవుతున్నాయి ... అందులో నీకు నచ్చిన దాన్ని ఏరుకుని తెలివిగా వర్తించు ... నీకు డబ్బూ దక్కుతుంది. సుఖమూ కీర్తీ రెండూ దక్కుతాయి ... ఇదీ నాయనా ఈ లోకంతీరు.

పోల: సామీ, మీరు సెప్పింది సానా బాగుంది.

వెంక: సామీ! ఆ తెలివి నాదగ్గర సావొద్దూ ... నాలాంటి తెలిః తక్కువ సన్నాసి ఒకేల సేసినాయిల్టే ... ...

స్వాము: దొరికి పోతానని భయం.

వెంక: అవును సామీ.

పోల: అరే ఎంకా, మన సాములోరు సెప్పింది నిజం.

వెంక: నిజమే అనుకో! ... అంటే కోపంగాని, అసలు నిజాయితీగా బతికేదెవడంట ... నాలుగు డబ్బులుంటే సరి అన్నీ అయ్యే సెల్లిపోతయ్యి.

స్వాము: నిజంజీవా, నిజం.

పోల: (స్వాములవారి ప్రక్కన చేరి) ... సామీ, యీ జోలిలో ఏముండాయో సూడొచ్చా అంట?

స్వాము: (కంగారుగా ఆ జోలిపట్టుకుని) ... ఎవరిచ్చిన చను
విది ! వెళ్ళు దూరంగా వెళ్ళు.

పోల: (ఏం లెక్కలేనట్లుగా) సను వు ఒకరిచ్చేదేంటి? ఆ సనువు
మేం తెచ్చిపెట్టుకోకూడదా అంట !

స్వాము: (కోపంగా) ఆ వేషాలు మనవద్ద సాగవు నాయనా.

పోల: కాలం పండితేసరి అయ్యే సాగుతాయి సామీ... ఏమం
టావురా ఎంకా ?

వెంక: అంటే కోపంకాని పోలయ్యో, ఏంటి సాములారితో
ఆ మోట సరసాలు ?

పోల: నిజమేరా అన్నాయ్ ! నిజమే ... సామీ - ఏమీ
అనుకోకండేం?... ఏదో మోటోల్లంకదా సామీ...

స్వాము: భగవాన్ ! ఏమిటిక్కడికి తెచ్చావ్ ?

పోల: (ఆవేశంతో) సాములూ నాదితప్పే . . . ఇక బాధపడ
మాకండి . . . ఈ పోకిరీ పోలయ్య ఇంక పోకిరీపనులు
మానేత్తాడని యిదే ఆడి పమానకం ! ఈడిబారం
మీదేసామీ ! మీకే ఆపదారాకుండా సూసే బారం
నాది సామీ.

స్వాము: ఆవేశపడకు నాయనా !

వెంక: ఏరోయ్ అయితే నువ్వూ సన్నాసివై పోతావంటి !

పోల: అవ్వక ఏంటెహె (ఆవేశంతో) . . . సామి అచ్చు
కోవాలేగని నా సామిరంగా . . .

స్వాము: అంతఆవేశం పనికిరాదు. ఆవేశం అనర్థాలు తెస్తుంది.

పోల: ఏమయినా కానియ్యి సామి. యిడవకుండా మీ ఎంట
ఉండాల్సిందే. నా సామిరంగా ఏమంటారు ?

స్వాము: ఆ విషయం ఆలోచిద్దాం.
పోల: ఆలోసిద్దామంటే కుదరదుసామిా.
వెంక: ఓరి! నీ కీ పిచ్చి బాగానే ఎక్కింది.
స్వాము: పోలయ్యా !
పోల : ఏంటిసామిా !
స్వాము: నీ పేరు సరైందేనా నాయనా ?
వెంక. బలే పెళ్ళఏసినారు... ఆడొట్టి దొంగ ఎదవ.
పోల: ఏరోయ్ ? ...ఆకర్మ నాకేంవచ్చింది? సామిా ... మా అమ్మా బాబూ మొక్కుకుని, ముద్దుగా ఈపేరె ట్టినారు సామిా ... కాకపోతే యిా నాయాలు కుదురు లేక దేశాలపాలయ్యాడండీ.
స్వాము: అదా నాయనా ?... స్వ గ్రామం ?
పోల: ఏమోనండీ సామిా? ఊహ వచ్చిన కాడనుంచీ, పోకిరీ వోన్నయి ఉన్న ఊరొది లేసాను ... అంతే ... అన్నిఉల్లూ మనయ్యే... అయితే సామిా మిాదగ్గర నాకింకా దాపరకం దేనికి ?
స్వాము: సందేహించకు నాయనా !
పోల: ఏమోనండీ సామిా !పూర్తిగా నమ్మేత్తుండా ... ఆపైన
వెంక: సాములోరిని నమ్మితే నష్టమేంటి ?
పోల: నేనండి . . . నేనండి పోకిరీపనులు సేసినప్పుడు ఏదైనా ఆపద వత్తదనుకుంటే ఏసాలు మారిసానండీ !
స్వాము: ఆహాఁ ! . . .
వెంక: అయితే పోలయ్యోయ్, నువ్వు మా అందరికన్నా పెద్ద కేటు వన్నమాట.

పోల: (విజయగర్వంతో) హ! హ! .... మరేంటనుకున్నా వురా భాయ్ ?

స్వాము: అన్ని వేషాలు దేనికి నాయనా ?

పోల: పొట్ట తిప్పలుసామీ, పొట్ట తిప్పలు.

స్వాము: పోలయ్యా! ఇదీ ఒక వేషమేనా అని మనసు సందే హిస్తోంది.

వెంక: మాబాగా అడిగారు.

పోల: బలేవారేసామీ! ఈ ఏసాలు పోలీసోల్లకోసం, నా సామిరంగా.

స్వాము: అయితే యివన్నీ ఒకేజాతి పక్షులన్నమాట.

పోల: అందుకే ఒకేసోట సేరినయ్యి.

స్వాము: ఆహా! ఏమి! భగవదేచ్ఛ!

వెంక: సామీ, యీడికికూడా దారిసూపండి.

పోల: ఉండరా నాసామిరంగా... అందరికీ దారి దొరుకుద్ది

వెంక: దొరుక్కుద్దంటావా ?

పోల: మన సాములోరుంటే మనకేంటిరా లోటు! ... సామీ! నేను ముందే సెప్పేత్తుండా... నాకు తెలిసిందల్లా బుకాయించటమే.

స్వాము: తొందరపడకు నాయనా.

పోల: సాములో, ఖీరడ్డమోకండీ... మీరు తన్ని తగిలేసినా సరే, నేను మిమ్మల్ని వదిలేది లేదు ... నాసామి రంగా.

వెంక: నేనూ అంతే సామీ.

పోల: సామీ, నాపనల్లా మీఎంటఉండటం, మీరు సెప్పిన పని సేయటం. ఆనకఏమన్నా కానియ్యి. ఇదే నాపమానకం నా సామిరంగా.

వెంక: నేనూ అట్టాగే సేత్తానని పమానకం సేత్తుండా.

స్వాము: పోలయ్యా, నువ్వు పోకిరీ నన్నావు గదా .... మరి పోలీసులు నిన్నెప్పుడూ పట్టుకోలేదా నాయానా!

పోల: ఎహె! అంతేనన్నమాట? అరే ఎంకా మన పేరేమిటిరా?

వెంక: బయల్దేరావు లెద్దూ మాంపెద్ద పోకిరీవు.

పోల: అట్టాసెప్పు! అట్టాసెప్పు!... సామీ, ఈపోలయ్య పోలీసోళ్ళకు దొరకడమేనా అంట నాసామిరంగా! ...సామీ, మనయవారం ఏంటో తెలుసా?... దొంగ దార్లుతొక్కేవాల్ల ఎంట ఉంటానే ఉంట, ఎవరికీ తెలీకుండా తప్పుకుంటానే ఉంట... అటువంటప్పుడు మన నెవర్రా పట్టుకునేది, ఎంకా చెప్పు.

వెంక: అంతేలే!

స్వాము: అయితే నువ్వు జగజ్జెట్టి వన్నమాట!

వెంక: మరేంటనుకున్నారు సామీ! ...పోలయ్య పెద్దకేటు కదంటండీ

స్వాము: మంచిది మంచిది!... పెద్దకేటులకే ఈలోకంలో ఏలోటూ ఉండదు నాయనా. లక్షలాదిమంది నేడ్పించే పెద్దదొంగలకూ ఏలోటూ లేదు. పైపెచ్చు వారు పెత్తనంకూడా చెలాయిస్తారు. కాని చిన్న కేటులకు ప్రమత్తత పనికిరాదు నాయనా. ప్రమాదాలకు గురి

అయ్యేది చిన్నవారే. అందువల్ల, అల్పులకతివిశ్వాసం పనికిరాదు నాయనలారా.

పోళ: మన విషయంలో ఆభయం మీకొద్దుసామీ

(ఇంతలో చంద్రయ్యా పాట విన్పిస్తుంది. తూలుతూ, పాడుతూ వస్తాడు.)

చంద్ర: సరగమెల్లి సరాసరి హా, హా,
నరులారా, ఓ నరులారా
దేవత లిచ్చిన మందు
తెచ్చా! హా! హా!
సావులేని మందు తెచ్చా!
దేవతలిచ్చిన మందు తెచ్చా
హుషారైన నిషామందు
సరాసరి సరగమెల్లి
సావులేని మందు తెచ్చా!
హా! హా!

అరేయ్, ఎవర్రా అక్కడ?

వెంక: పోలయ్యో, ఈడికియ్యాల బేవార్సుగా తగిలినట్టుంది. జోరుగాఉంది ఆడియవారం.

పోల: ఊ! అట్టాగా

చంద్ర: (స్వాములవారి ముందుకువచ్చి) ... ఎవడ్రా ఆడు, మాట్టాడ్డేరా?

వెంక: సంద్రయ్యా! ... సరగమెల్లి తెచ్చా ఏంటిరా?

చంద్ర: అవున్రా! సరగమెల్లి తెచ్చానురా, సరగమెల్లి తెచ్చాను.

వెంక: నాకు కాస్త పొయ్యిరా ఆ మందు.

చంద్ర: పోరా పనికిరాని ఎదవంట పనికిరాని ఎదవ, ఈ మందు నీ కిత్తా ననుకుంటున్నా ఏంటిరా !

వెంక: ఈ డొద్ద మా ఉండిసచ్చినట్టు.

చంద్ర: షా ! ఎవడ్రానువ్వ ?... నా దగ్గర లేందంట్రా!... నామర్దా మాట మాటాడతా వేంరా నామర్దా మాట ! ... ఇదిగోరా సూడు (అని జేబులో నుండి సీసాతీసి చూపుతాడు) ... దీన్ని సరగంనుండి తెచ్చారా

స్వాము: ఏమిటది శిష్యా?

పోల: మీకేం బయంలేదు సామీ

చంద్ర: ఆడెవడు ? ఆడెవడ్రా ?

పోల: నీ మొగుణ్ణిరా, నీ మొగుణ్ణి.

చంద్ర: ఎవడ్రా ఆ మొగాడు? ఆ ... (అని ముందుకు రా బోతాడు)

పోల: అడుగు ముందేశావా, నా సామిరంగా నెత్తిపగిలిందే.

చంద్ర: రారా, పగల కొడుదువుకాని రారా ... ఈడంట పెద్ద రౌడీ ఎదవంట, నన్ను కొడతాడంట... రారా కొడుదువుగాని రారా.

వెంక. ఆయనతో ఏంటిగాని ... వాసిపోయి ఉండాను ... నా నాలి కాస్త తడిసెయ్యి.

చంద్ర: తప్పురాతప్పు ! ఇది దేవతల మందురా ! దేవతల మందు! నరులు తాగకూడదు.

స్వాము: ఏం నరులు తాగకూడదో! ఈ నా డిదొక ఫ్యాషనై పోయింది.

పోల: అవును సామీ !

(చంద్రయ్య స్వాములవారి మీదకు తూలుతాడు)

పోల; ఎరా కళ్లు కనపడ్డం లేదా ? ఆపక్క నడువు.

చంద్ర: ఏరోయ్ పొగరెక్కిందా పొగరు ?

వెంక: చంద్రయ్యా అక్కడ సాములుండాడు.

చంద్ర: ఎవడా సాములోడు ? ఎవ్డ్రా ?... ఆ !

పోల: అరేయ్ ! చంద్రిగా! పెద్దపోకిరీ పోలయ్య మర్యాదగా సెబుతుండాడు... సాములను మాట మిగిలావో ?

చంద్ర: పోరా యిట్టాంటోల్లను సానామందిని సూసాను .... మాటమిగిత్తే ఏదో సేత్తాడంట ? .... సామీ .... ఇది దేవతలమందు .... రుసి సూత్తారా ? సూడు, మా మజాగా వుంటందిలే ! .... యిది తాగితేసా వుండదు, సావు.

పోల: (పోలయ్యవచ్చి చంద్రయ్య చొక్కా పుచ్చుకొని) ఏంటిరా ఊరికే నోటికొచ్చినట్టు పేల్తున్నావు ? నా పోకిరీతనం ఏంటో తెలుత్తుది-రా-రా (అని చంద్రయ్యను లాగుతాడు)

చంద్ర: అరే నువ్వా బాయ్ నువ్వా ! .... నిజంగా నీవను కోలేదు. భాయీ-షా-బట్టు- మనిద్దరం ఒకటేగా. బాయ్ మనిద్దరం ఒకటేగా.

వెంక: ఏముంది ఎదవకు సిగ్గా ఎగ్గా ? అందితే జుట్టు లేకపోతే కాల్లు.

చంద్ర: ఏరోయ్, నోరు మూ లేత్తావుంది.

పోల: అరేయ్ !.... నోరెత్తావా, డొక్క సీరేశానే నాసామి రంగా.

వెంక: అరేయ్ ! సంద్రయ్యా వదిలిందా తిక్క ?

చంద్ర: సూడు అన్నాయ్ ఆడు ! సరేగాని అన్నోయ్

పోల: ఏంట్రా ?

చంద్ర: (బుడ్డిచూపుతూ) అన్నాయ్ నువ్వూ సాములోరూ దేవతలు ....

వెంక: అరేయ్ నా కా త్తివ్వరా.

చంద్ర: నువ్వు నరుడవురా, నువ్వు నరుడవు నరులు తాక్కూడదు.... ఈ బూలోకంలో తాగితే తప్పురా తప్పు. ఏం అన్నాయ్ నువుసెప్పు.

వెంక: పోరా మూ సెప్పొవుగాని ! ఎంతమంది తాగటం లేదూ !.... డబ్బుంటేసరి యెక్కడ పడితే అక్కడే దొరుకుద్ది.

చంద్ర: పోరా అక్కడికేపోయి తాగు. నన్నడుగుతా వెందుకు? ఇది దేవతల మందు.

పోల: ఏంటిరా చంద్రిగా యీ అల్లరి (వీపుమీద ఒకదెబ్బ కొట్తాడు ... మా బయద్దేరాడు పెద్దరాడీ .... ఎట్టా వుంది సామీ మన పెతాపం.

స్వాము: బాగు బాగు !

వెంక: నా పేరుసెప్పి యింకోటియ్యి పోలయ్యా - యీాడు రోజూ మా గొడవ సేత్తున్నాడు ....

పోల: సాములూ, తాగినోల్లంతా కావాలని అల్లరిసేత్తారు.

చంద్ర: నేనేం అల్లరి సేసాను బాయ్ (వెంకయ్య సీసాను లాక్కోబోతాడు. అందదు) అరేయ్! ఏంటను కున్నావో! పోలీసోల్లకు పట్టిస్తా.

వెంక: పోరా!

చంద్ర: అన్నాయ్.

పోల: మాట్టాడొద్దం టేమాట్టాడతావేరా (అని మళ్ళీ ఒక్కటి కొడతాడు)

చంద్ర: కొట్టకన్నాయ్, కొట్టకు ... ఇది అల్లరి కాదన్నాయ్ వట్టి యాక్సను, వట్టి యాక్సను అన్నాయ్

వెంక: (చంద్రయ్య దగ్గరకు వెళ్ళి బతిమాలుతూ) సంద్రయ్యా!... నువ్వు మంచోడివిరా! ... ఏదీ, నాకూ కాడా కాత్త .:.

చంద్ర: ఈడు సూడన్నాయ్, ఈడు సూడు. బూలోకంలో నరులు తాకూడదుకదూ.

పోల: అవున్నా బాయ్! అవును! ... అరే ఎంకా, నువ్వు అక్కడలే.

స్వాము- వెంకా, నీకు పాత అలవాటు పోలేదన్నమాట.

వెంక: పాతవాసనకందండీ, సప్పున పోదు ...

చంద్ర: పాతవాసనంట! పాతవాసన! దొరికితే రోజూ ఏత్తాడు ...

వెంక: నీకుమల్లే నాకు బేవార్సుగా దొరకటం లేదుగా.

పోల: అరే య్, ఎంకా, నువ్వుపోరా అంటే,

వెంక- ఏంటి పోలయ్యా నువ్వుకూడా. నువ్వు తాక్కపోతే మానె, నాక్కా త్రిప్పిచ్చవయ్యా.

పోల. ఏరా నీకూ ఒకటియ్యాలా ?.

వెంక: పోనీ లేవయ్యా.

పోల: చంద్రిగా, సాములోరికి దణ్ణం పెట్టు.

చంద్ర: అట్టాగా అన్నాయ్ ! సాములూ, దణ్ణాలు ! (అని ప్రక్కన పెడ్తాడు)

పోల: సరిగా పెట్టవేరా ! (అప్పుడు సరీగా పెడ్తాడు) చంద్రిగా జై లెట్టా వుంటదో ఎప్పుడన్నా సూశావంటరా ?

చంద్ర: అమ్మో ! జై లే ! దాని పేరంటేనే గుండె ఆగిపోద్ది గురూ.

పోల: ఓరి పిరికి సన్నాసీ, పిరికిసన్నాసి... మన సాములోరి కున్న నిబ్బరం నీకు లేధన్నమాట

స్వాము: ఆమాటలకర్థం ?

పోల: ఏంటి సామి, నేనన్న దాంట్లో తప్పేముంది? అన్నీవది లేసి నోల్లకు ఎక్కడై తే ఏముందంట !... జోగులు కదా సాములు !

స్వాము: అటులయినచో అభ్యంతరం లేదు.

పోల: నా సామిరంగా... చంద్రిగా ! పోలీసోళ్ళంటే బయ మేరా ?

చంద్ర: సంపావురా ! ... ఆ మాట నెమ్మదిగా అడుగుతా వేంటి ? ... ఆల్లంటే హడల్, హడలేరా

పోల: అంతబయం ఉన్నోడివి యింత అల్లరెట్టా సేత్తుండా వురా?

చంద్ర: (సీరియస్‌గా, యాక్షన్ మానివేసి మామూలుమాటగా అంటాడు) అసలు నేను తాగలేదు గురూ! నే నింత వరకూ చేసిందంతా వట్టి యాక్షన్, వట్టి యాక్షన్ అంతే.

పోల: ఓరి చంద్రయ్యా! నువ్వా ఉండవలసినోడివే ... అరేయ్ తాగినప్పుడు ఈ గల్లంతు సేత్తావురా?

చంద్ర: తాగినప్పు డసలు బయట మాట్టాడనుగా...మామూలప్పుడే. పోలీసులు కన్పిస్తే ఎందుకయినా మంచిదని ఒక సెల్యూట్ పారేస్తాం. దాంతో వాళ్ళు ఐస్ అయిపోతారు.

స్వాము: శిష్యా!

పోల: ఏంటి నా సామిరంగా.

స్వాము: మనవాడూ తక్కువ తిన్నవాడు కాదనుకుంటానే.

పోల: అందరూ అందరేగురూ!

స్వాము: పోలీసులంటే శిష్యునకు భయం లేదనుకుంటాను.

పోల: మనకేంటిబయ్యం సామీ!

వెంక: పోలయ్యో! ఎదో పెద్ద పోకిరీ నను కుంటుండావు? పోలీసోల్లు మంచోల్లుకాదు.

చంద్ర: మన వెంకడు చెప్పింది నిజం అన్నాయ్.

పోల: పొండిరా!

వెంక: అనుబవంమీద సెబుతుండా! అల్లకి జాలనేది ఉండదు— జైల్లోనే కుమల పొడుత్తారు.

పోల: తప్పుడు పనులు సేత్తే పోడవరేంటీ, నా సామిరంగా.

వెంక: తప్పుడుపనులు సేసినోల్లందరినీ పోడుత్తారేంటి ?
దిక్కూ మొక్కూ లేనోల్ని పోడుత్తారు.

స్వాము: నాయనలారా, వెంకయ్య చెప్పిందినిజం.

చంద్ర: (పోలయ్యతో) అన్నాయ్ బింకానికిపోయిపోలీసులతో తగూ పెట్టుకునేవు ... ఏదో వంకపెట్టి జైల్లో తోసేస్తారు.

స్వాము: శిష్యా అదీ నిజమే.

పోల: ఏంటో అనుకున్నా నాసామిరంగా! .... మా గురువుకి శానా లోకానుబవం వుంది.

వెంక: ఆ! సాములంటే మాటలనుకున్నావా ఏంటి ?

పోల: అట్టాగా అంట!

చంద్ర: మన స్వాములకూ పోలీసు వాళ్ళతో అనుభవము ఉండదంటావా భాయ్ ?

స్వాము: (కోపంగా) ఏమిటా అప్రాచ్యపు మాటలు !

పోల: ఏరా ఏం ? —— మా గురువంటే ఆసామాసీ అనుకుంటన్నావా అంట !

చంద్ర: లేదు గురూ ! —— ఆఁ వున్నమాటంటే ఎవరికైనా ఉలుకేలే.

స్వాము: (కోపంగా) ఏమిటా దురహంకారం ?

పోల: మా గురువు నంతమాటంటావా అంట ? (అని ఒక్క దెబ్బ వేసాడు)

చంద్ర: ఏం టన్నాయ్ అట్టాకొడ్తావ్ ? (ఇంతలో వెంకన్న చంద్రయ్య జేబులో సీసాలాగి, ఆత్రంగా నోటిలో

పోసుకుంటాడు. అదిచూసి చంద్రయ్య విరగబడి నవ్వుతాడు. స్వాములవారు, పోలయ్య తెల్లబోయి చూస్తారు)

వెంక: తూ! దొంగసన్నాసి! (అని నోటిలో నీరు ఊసేసి ఆ సీసా నీరసంగా అక్కడ పడేస్తాడు)

పోల: శంద్రిగా, ఆ నవ్వు ఏంటి?

చంద్ర: వెంకడినే అడుగు.

పోల: ఏంట్రా ఎంకా?

వెంక: ఏముంది?.... శంద్రయ్య పచ్చి మోసం సేశాడు ... ఆ సీసాలో వట్టినీళ్ళుపోసి సారా అని నమ్మిచ్చాడు.

స్వాము: లోకమే మోసం.

పోల: అంతే నాసామిరంగా అంతే... శంద్రిగా, ఆడు సెప్పింది నిజమేనా?

చంద్ర: నిజమే అన్నా య్ !

పోల: ఇందాక నువ్వు సెబితే నమ్మలేదు.... అయితే నువ్వసలు తాగలేదన్నమాట

చంద్ర: యాక్షనని అప్పుడే చెప్పానుగదా భాయ్ ... కాక పోతే పాపం ఒక పిచ్చోడివద్ద దబాయించి పావలా కాజేసి కాస్త నాలుక తడిచేసుకు వచ్చా!... అంతే.

పోల: ఎంత నమ్మించావురా! ... ఈడూ మనలో ఉండాల్సిన వాడే గురూ.

స్వాము: శిష్యా! ఈ లోకంలో అంతా నటన కావాలి నాయనా!....నటన కావాలి. నటించగలవాడే అందలా లెక్కగలడు ... బ్రతుకుదెరువుకు అదొక రాచబాట నాయనా!

చంద్ర: మీరు చెప్పింది నిజం. అయితే ఒకచిన్న సందేహం గురూ! మన గురువుదీ నటనేనా అని?

పోల: అరేయ్! ఆ తప్పుడుకూతలే కూయొద్దన్నానా?

చంద్ర: తప్పే అన్నాయ్ తప్పే... వేషంలోనే ఉందిగురూ మోసం.

స్వాము: ఆ మాటమాత్రం నిజం!

పోల: అట్టాగా సామీ! ... అయితే నీ ఏషం కిటుకేదో చెప్పరా చంద్రిగా?

చంద్ర: చెప్తాగాని ఏదీ హైద్రాబాద్ నవాబ్ సిగరెట్టొకటి రానియ్యి.

వెంక: అడుక్కుతినే బతుకైనా అదం ఎంతరా, అదం?

(చంద్రయ్య పోలయ్య యిచ్చిన సిగరెట్టు ముట్టిస్తాడు)...

వెంక: నాకూ ఒకటి పడెయ్యి పోలయ్యా

పోల: అదేపనిరా నాకు.

వెంక: ఏదో లేవయ్యా... ఇద్దూ (ఒక బీడీ యిస్తాడు. అంటిస్తాడు)

చంద్ర: అరేయ్ ఎంకా! ఇంతకాలం నుంచీ మనం లైఫ్‌ను గురించి తెలుసుకున్న దింతేనంట్రా? మనలైఫే ఒక స్టయిల్.

స్వాము: బాగు, బాగు.

వెంక: ముష్టి బతుకను గురించి గొప్పలెందుగ్గాని, ఆ ఏడిసే దేదో సప్పునేడువు.

చంద్ర: (కోపంగా) ఎవడ్రానువ్వు రాస్కెల్! ... యీ చంద్రయ్య అంటే ఏదో అణాకాని రకమను కుంటు న్నావు కాబోలు.

స్వాము: నాయనా, నీ జీవితం సంగతి ఎలావున్నా, నీ తీరు హుందాగావుంది.

చంద్ర: మనలైఫే అంతగురూ!

పోల: ఈ ఇంగ్లీషు ముక్కలు ఎక్కడ పట్టావురా నాన్నా?

చంద్ర: మన రోజులు బాగుపడక బతుకిట్టా అయిందన్నాయ్ నా పూర్వ పరిస్థితినీ నా ఫామిలీని తలచుకుంటే ...

పోల: కొయ్యిరా కొయ్యి ...

వెంక: అప్పుడే ఏం యిన్నావ్?

చంద్ర: (బాధగా) నా జీవితం జ్ఞాపకంచేసి మీా రివ్వాళ నా గుండె బరువెక్కించారు. నా బ్రతుకు నేటి కీ విధంగా బద్దలై నలుగురిలో నవ్వులపాలయింది... చేతులారా చావలేక, సుఖం పడిన ప్రాణం ఏమో, నేడు కష్టపడ

లేక మానసాన్ని మనసులో దిగమింగి, జీవితం గడుపు తున్నా.

వెంక: పోలయ్యో! ఆడింత సెప్పాడా! అడుక్కుతిని బతుకు తున్నావంటే ఒప్పుకోడు.

చంద్ర: అవున్రా! అవును! నాది ముష్టి బతుకు కాదు. తెలిసిన వాళ్ళను రిక్వెస్టుచేసి నాలుగుడబ్బులు సంపాదిస్తాను.

పోల: పోనీలే, నువ్వు అడుక్కుని బతకటంలేదే అనుకుందాం, సరేలే ఆ గొప్ప బతుకేంటో సెప్పు.

చంద్ర: నాది హై ఫామిలీ ... అమ్మా నాన్నా చదువుకోరా నాన్నా అంటే, గోడలు దూకి థర్డుఫారం మూడుసార్లు తప్పాడు ఈ చంద్రయ్య. పెరిగాడు ... కన్నా మిన్నా కానకుండా. ఒక్క వెలుగు వెలిగాడు ...

స్వాము: ఆ వెలుగు చిటుక్కున ఆరిపోయింది.

చంద్ర: అంతేగురూ, అంతే ... దాంతో మొదట్లో మతి చలించిది. తరువాత తేరుకున్నా ... కాని పిచ్చివంక మీదే, యీ రోజువరకూ గెట్ ఆన్ అయిపోతున్నా.

స్వాము: బాగు బాగు.

వెంక: పోలయ్యో, వీడితరా నే సూశాగా ... ముట్టి అడుగుతాడా

చంద్ర: అరేయ్ ముష్టి అనొద్దన్నానా ! ... అది ముష్టికాదు, రిక్వెస్టు.

పోల: ఏద్దైతే ఏంటిలే అంటా ?

చంద్ర: అమ్మా ! అదెట్టా అచ్చుకుంటాను గురూ !

పోల: ఆడితో ఏంటిగాని, నువ్వు సెప్పరా ఎంకా.

వెంక: యీాడు ఎవర్నయినా డబ్బడుగుతాడా ... ఆ పెద్ద మని సివ్వకపోతే నాలుగు కూతలుకూడా కూత్తాడు.

పోల: ఆఁ ! నా సామిరంగా కూత్తాడు.

చంద్ర: అంతేకదా గురూ ... అసలే చచ్చి అడుగుతుంటే, పో అంటే ...

పోల: బాగుంద్రా తమ్ముడూ ! మజాగా ఉంది.

స్వాము: శిష్యా ! మనవాడి పద్ధతి అందరకూ చాతకా వద్దూ ...

చంద్ర: రైట్ గురూ రైట్! (ఇంతలో పిచ్చివాడు ప్రవేశం. అందరినీ చూసి, స్వాములవారి వంక తదేకంగా చూస్తాడు. ఆయన ప్రక్కనే చేరతాడు)

పోల: ఈడెవ్వడూ అంట !

చంద్ర: మనండబాయించి పావలాపట్టింది యీాపిచ్చివాడి వద్దే...వీడొక బంగారం పిచ్చోడు. (అని హేళనగా అంటాడు)

వెంక: నీకు నవ్వుగానే ఉంటది శంద్రయ్యా... ఆయన ... సంగతి యింటే మనుసు నీరై పోద్ది.

పిచ్చి: స్వాములవారికి నమస్కారాలు.

స్వాము: జై భగవాన్! శుభమస్తు.

పిచ్చి: తెచ్చారాస్వామీ?

స్వాము: (ఆశ్చర్యంగా) ఏమిటి?

పిచ్చి: తెస్తానన్న బంగారం, ఇస్తానన్న బంగారం... హిం! హిం!

స్వాము: ఇదేమిటి వింతప్రశ్న?

పోల: పిచ్చివాడి పెశ్నలు యింతగానే ఉంటాయిగదా సామీ!

పిచ్చి: ఇదిగో ఆనాడు మీరిచ్చిన బంగారం (అని మూటవిప్పి చూపుతూ) భద్రంగా దాచుకున్నాగా! హిం! హిం! ఎక్కడా పారేసుకో లేదు.

పోల: ఏయ్ పిచ్చోడా!

పిచ్చి: (భయంగా చూస్తాడు. పలకడు. పోలయ్య వాడి మూటలోనుండి కొన్నిముక్కలు తీసుకొని పరీక్షిస్తాడు...) అమ్మో నాబంగారం ... నాకీబంగారం ఈ స్వాములవారిచ్చాడు ... మళ్ళీ తెస్తానన్నాడు.

పోల: ఇది బంగారం కాదు, ఇత్తడి.

పిచ్చి: అమ్మో! బంగారం! మంచిబంగారం.

స్వాము: ఇదేం కర్మరా భగవాన్! నా పాలిటిశనిలా నేడు

వీడెక్కడ దాపురించాడు? బైరాగుల మఠమని, ప్రశాంతంగా వుంటుందని యిక్కడకు వచ్చాను ... రామ రామ! తీరాచూస్తే యిక్కడుంది రౌడీలూ, తాగుబోతులూను ... దుష్టులకు దూరంగా వుండడం మంచిదన్నారు పెద్దలు ... (అని మాటముల్లె సర్దుకుని లేస్తాడు)

చంద్ర: ఆ! ఏంటిసామీ, మీరా పిచ్చోడిమాటలకు బెదరిపోతారు ... వాడందరినీ అలాగే అడుగుతాడు.

వెంక: ఆ మాట నిజమే సామీ.

స్వాము: ఏమైనా, మావంటి వారికిది చోటుకాదు. (అని రెండడుగులు వేస్తాడు)

పోల: భలేవారే సామీ! ... ఈ పోలయ్యవుండగా మీకు అపకారం జరగటమేనా అంట! ... అయినా ఈ రాత్రిపూట ఎక్కడకని ఎలాసామీ.

స్వాము: ఏమో నాయనా! ఎవరినీ నమ్మరాని కాలమిది.

వెంక: ఆమాట నిజమే సామీ.

పోల: అరేయ్ ఎంకా, పిచ్చోణ్ణి సూసి సాము లసలే బెదిరిపోతుంటే నువ్వు మరీ అడలేత్తావేంటి?... సాముల వారి పని శేశాడంటే, అసలీ లోకం ఎట్టానమ్మద్ది అంట!

చంద్ర: ఆ మాట నిజమే గురూ! మీరు కుర్చోండి.

పోల: (ఆలోచించి) శంద్రయ్యా!

చంద్ర: ఆ! ఆ!

పోల: నువ్వన్నట్టు ఏసంలోనే ఉందేమో మోసం?

స్వాము: ఇది వేషంకాకపోవచ్చు నాయనా!... దురాశలిటు వంటి దురవస్థలు తెస్తాయి నాయనా! బంగారం కోసం దురాశకుపోయి, డబ్బుపోగొట్టుకుని ఉంటాడు.

వెంక: అంతే సామీ! ... ఎవరో దొంగసాములు మోస గించాడంట... ఈయన పెళ్లాంబిడ్డలు అలో లచ్మనా అంటా ఏడుత్తున్నారు.

స్వాము: అదంతా ఒక కర్మ.

చంద్ర: అంతేగురూ.

పిచ్చి: మీకు పదివే లిచ్చానుగా స్వామీ ... నేను రంగ నాయకులను. కాకినాడ.

స్వాము: పోలయ్యా! ఈ పీడ నాకు దాపురించిం దేమిటి?

పోల: పీడ తర్వాలోనే వదిలిత్తా సామీ! ... తొందర పడ తారేం! ... దేనికైనా సమయం రావాలి.

చంద్ర: నేను వదిలిస్తా నుండండి! అరేయ్! నీ జేబు చూడనియ్యి. డబ్బులు ఇవ్వకపోతే రెండు పడ్తాయి. (పిచ్చివాడు భయంతో పరుగెత్తబోతాడు)

పోల: బయపడకబ్బీ! బయపడకు. అరేయ్! శంద్రయ్యా, బెదిరించు. అంతే. కొట్టబోకు. (అని వెనక్కు వెళ్ళి

ఫోటో తీసి చూచుకుంటాడు) ... అరేయ్! పిచ్చి వాడా కూర్చో ... పిట్ట వల్లో పడింది.

స్వాము: అనగా.

పోల: అనగా ఏమీ లేదు గురూ! పిచ్చివాడికి వేసిన మంత్రం ఫలించింది.

స్వాము: నీ ప్రయత్నం ఫలించుగాక!

పోల: మీ రాశీర్వదించిన తరవాత ఫలిచ్చకుండా ఎట్టా ఉంటాది! నా సామిరంగా ...

చంద్ర: అరేయ్! వెంకా! ... ఆకలవుతోందిరా - అన్నం తీసుకురా.

వెంక: ఈడిదంతా జమీందారు దర్జా! ... ఈ దొరకంట అన్నం పట్టుకు రావాలంట ...

చంద్ర: అడుక్కు తెచ్చిన అన్నం లేదంట్రా!

వెంక: అసలీపూట బయటకే కదల్లేదు.

చంద్ర: ఎరా! ఈరోజు పోలయ్యా వచ్చేటప్పటికి కొంచెం తలకు నీరు పట్టినట్టుందే... ఊ! అన్నంపట్టుకురా.

వెంక: పో! అన్నంలేదు సున్నంలేదు ... నేనే ఆకలేసి సత్తుంటేను.

పోల: నాకూ ఆకలేత్తోంది బాయ్!

చంద్ర: వేశాడురా ముందుకాళ్ళకు బంధం!

పోల: అదేం కాదురాభాయ్ ! మనదగ్గర పైసాలేదు.

చంద్ర: ఆ మిఠాయి కొట్టువద్ద ఇవాళ పప్పులుడకలేదురా! పడితే ఖరాబంతా ఒకేరోజు పడుతుంది.

స్వాము: అది ముమ్మాటికీ నిజం!

పోల: శంద్రిగా!

చంద్ర: ఉండుబాయి! ఆకలేసి ఛస్తూంటేను.

పోల: అలా దిగులు పడ్తావేంటి! దారిసూపటానికి గురువు గారుంటేను.

చంద్ర: అందుకేగా భాయ్ నేనిందాక ఎత్తువేసింది. నువ్వు చెడగొట్టేశావ్.

స్వాము: అపచారం! పెద్ద అపచారం! ... అటువంటి పని ఎవరికీ శ్రేయస్కరం కాదు నాయనా.

పోల: అట్టాటిదేం జరగదులే సామీ! ... అరేయ్! పిచ్చోడా! ఆకలేత్తుందా?

పిచ్చి: హి! హి! బంగారం! బంగారం.

పోల: చంద్రిగా!... ఆకలితీరే మార్గమే దొరకదంటావా? (స్వాములవారి సంచి చూపించి) ... చూస్తావేం (అని చాటుకు వెళ్ళిపోతాడు)

చంద్ర: స్వామీ ... యీ జీవుడల్లాడి పోతున్నాడు. ఆదరించు గురూ.

స్వాము: ఆదరించడానికి నే నెవరిని నాయనా ... అందరకూ ఆ భగవంతుడే వున్నాడు.

పిచ్చి: స్వామీ! తెచ్చారా బంగారం.

చంద్ర: ఉండరా నువ్వేమిటి? (అని కొట్టబోతాడు. పిచ్చి వాడు బెదిరి దూరంగా ఉంటాడు) స్వామీ! తమరి సంచి దయ తలచింది కాని, తమ మనసుమాత్రం...

వెంక: దయతలసలేదు.

స్వాము: (కంగారుగా) జోగిని జీవుల్లారా జోగిని! జోగుల వద్ద ఏముంటుంది నాయనలారా. అవసరం వచ్చి నపుడు ఆకలిని అణచుకోవాలి. అది ఆరోగ్యానికి మంచిది.

చంద్ర: (అసహనంతో) మీరు బాగా మెక్కి మమ్మల్ని ఏడిపించడం న్యాయమా స్వామీ.

స్వాము: అది లోక ధర్మం.

(చంద్రయ్య సంచి లాక్కోబోతాడు. స్వామి జాగ్రత్త పడతాడు. వెంకయ్య పెద్దమనిషిలా నటించి, "అదే మిటి శంద్రయ్యా" అంటూనే స్వాములవారి రెండు చేతులను కదలకుండా పట్టుకుంటాడు. చంద్రయ్య సంచి లాగేసుకుంటాడు)

స్వాము: (కోపంగా, ఖంగారుగా) ఏమిటీ దౌర్జన్యం?

చం౹ద: లోకధర్మం గురూజీ! లోకధర్మం.

స్వాము: ఇస్తావా, ఇయ్యవా?

వెంక: చం౹దయ్యా, యిచ్చెయ్యరా పాపం!

చం౹ద: నువ్వు తగ్గరా

స్వాము: మర్యాద దక్కదు చం౹దయ్యా.

వెంక: అంత కోపంవద్దు స్వామీ — నేను తీసుకొస్తాగా.

చం౹ద: (మూటవిప్పితే అన్నీ నోట్ల కట్టలు – రూపాయలు, రెండు రూపాయలు, పదిరూపాయల నోట్ల కట్టలు ఉంటాయి. చం౹దయ్య సంతోషంతో పిచ్చగా నవ్వేస్తాడు) ఎంతడబ్బు! ఎంతడబ్బు—అమ్మ స్వామీ! ఎంతడబ్బు దాచావ్!

వెంక: నాకూ వాటా పెట్టరా.

చం౹ద: పోరాపో! — వాటా కావాలేం!

వెంక: పదిరూపాయలు సాల్లే, నాకెంత కావాలి!

స్వాము: (వెకిలిగా నవ్వుతాడు. చం౹దయ్య, వెంకయ్యలు తెల్లబోయి చూస్తారు. స్వామి లాక్కోవాలని ౹పయత్నిస్తాడు. కాని లాభంవుండదు)

చం౹ద: ఆ పప్పులుడకవు సామీ.

స్వాము: పో పో! పట్టుకుపో! అప్పుడే తెలుస్తుంది అసలు విషయం.

(వెనకనుండి పోలయ్యవచ్చి, హాఠాత్తుగా చంద్రయ్య చేతిలో మూట లాగేస్తాడు)

పోల: గురూ! సూశావా! నేనుండగా నీకేం భయంలేదు.

స్వాము: శిష్యుడవంటే నువ్వే పోలయ్యా!

చంద్ర: (కోపంగా పోలయ్యా! నాడబ్బు నాకిచ్చేయ్.

పోల: (వాటిని పరీక్షిస్తూ) పోరా ఫో!

పిచ్చి: నా బంగారం, నా బంగారం.

పోల: నువ్వుండరా నా తండ్రీ!

చంద్ర: సంపాదించుకున్న తరువాత తింటానికంతా వస్తారు .. పోలయ్యా, మర్యాదగా యిస్తావా చేయి చేసుకోమంటావా?

పోల: తాటాకు చప్పుళ్ళకు కుందేళ్ళు బెదరవు జీవా!

చంద్ర: అరే ఎంకా నీకూ వాటా యిస్తా! ... రా! వీడి అంతేదో తేలుద్దాం ... (అని పోలయ్య మీద కల బడ్తారు. స్వాములవారు పారిపోవడానికి నెమ్మదిగా రెండడుగులు వేస్తాడు. పోలయ్య యిది కని పెట్టాడు. చటుక్కున పిస్టలు తీసి)

పోల: ఆగండి! ... (చంద్రయ్య వెంకయ్యలు నిర్ఘాంతపోతారు. స్వాములవారు వెనుకకు తిరిగి చూస్తాడు) స్వామీ అడుగు కదిపారా ఠాం! ... (అని స్వామి ముందుకు

వచ్చి పిస్టలుచూపి చేయిపట్టుకుని) ... పిట్ట చేయి చిక్కింది. నేడు నాకు చాలా సుదినం.

స్వాము: (కంగారుగా) ... అమ్మ పోలయ్యా! ... ఎంత నమ్మించావు! ... ఇంతకూ ... ...

చంద్ర: నువ్వు పోలీసువా?

పోల: వేషంలోనే ఉంది మోసం. నేను సి. ఐ. డి. ని ... (జేబు నుండి ఫోటో తీసి) ఈ ఫోటో ఎవరిది?

స్వాము: నాకు తెలీదు,

పోల: గురూ! ఈ వేషాలు మనవద్ద సాగవు ... దొంగనోట్ల కేసులో ఒకసారి రెండేళ్ళు జైలుశిక్ష అనుభవించినా ఇంకా బుద్ధిరాలేదూ ... ఇంకా ఈ దొంగనోట్లతో వ్యాపారం సాగిస్తున్నావా? ఇంకా ఎంతమందిని మోసం చేద్దామని?

చంద్ర: ఇంతకూ అవి దొంగనోట్లా!

స్వాము: హరీ! హరీ!

వెంక: దొంగసాములవా నాయనా! ... అందుకేనా, రాజ మంత్రం పేరేత్తేటప్పటికి కోపంవచ్చింది!...

స్వాము: నే నే అన్న మాటేమిటి నాయనా! ... ఎవరైనా దొరికితేనే దొంగ ... దొరక్కపోతే దొరే...

పోల: ఊం! పోలీసుస్టేషనుకుపద!

చంద్ర: నటన కావాలి కదూ గురూ నటన ...

పిచ్చి: నా బంగారం! నా బంగారం!

పోల: అరేయ్, మీరుకూడా పదండిరా పోలీసుస్టేషనుకు.

చంద్ర: తప్పయిపోయింది సార్! తప్పయిపోయింది.

వెంక: లెంప లేసుకుంటున్నానుండి, తెలియకన్నానుండీ!

పోల: సాక్ష్యానికే లెండిరా.

చంద్ర: అట్టాఅని స్టేషన్లో పెట్టవుగదా?

పోల: అల్లాంటిపని చేయనులే—

చంద్ర, వెంక: అయితే సాక్ష్యం మీరు చెప్పమన్నట్టు చెపుతాం ... పదండి సామీ.

స్వామి: పెద్దజైలుకు బదులు చిన్నజైలుకు ప్రయాణం! ఎక్కడికయితేనేం నాయనా! ... జై సీతారాం. (వెళ్ళిపోతారు!

పిచ్చి: నా బంగారం! ... నా బంగారం (అంటూ వాళ్ళ వెంట పడ్తాడు. తెర పడ్తుంది)

(అయిపోయింది)



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B111 |
| పుస్తకం పేరు | దొరికితేనే దొంగ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | BC,48 |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Sandhya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |